చేర్చి, అనుసంధింప బడుతున్నది. ఈ ప్రబంధవైభవం వాచామ గోచరం. పురుషసూక్తం తెలియనివాడు బ్రాహ్మణుడు కానట్లు, ఈ ప్రబంధం రానివాడు ప్రపన్నుడు కాడని అభిజ్ఞులైన ఆచార్యుల సూక్తి.

## ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది

**అవ :** తిరువరఙ్గత్తముదనార్ అనుగ్రహించిన ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది ప్రబంధంలో రెండు పాశురాలలో శ్రీవేంకటేశ్వరుని తిరునామం కీర్తింపబడింది.

ప్రస్తుత పాశురంలో శ్రీతిరువరంగత్తముదనార్ భగవద్రామానుజులను ఉద్దేశించి- "స్వామీ! దాసునికోసం తమరు ప్రత్యేకంగా ఏమీ చేయనక్కరలేదు. దాసునకు సర్వస్వం అయిన తమ దివ్యపాదరవిందాలను అనుగ్రహిస్తే చాలు- అని ప్రార్థిస్తున్నారు.

నిన్దవణ్ కీర్త్తియుమ్ నీళ్ పునలుమ్, నిఱైవేఙ్గడ ప్పొ
ఱ్కున్దముమ్ వైగున్ద నాడుమ్ కులవియ పాఱ్కడలుమ్,
ఉన్దనక్కు ఎత్తనై యిన్బన్దరుమ్ ఉన్నిణైమలర్త్తాళ్
ఎన్దనక్కుమ్ అదు, ఇరామానుశా! ఇవై యీన్దరుళే 76వ పా

భగవద్రామానుజా! శాశ్వతం అయిన, నిరవధికం అయిన కీర్తితో, లెక్కలేనన్ని సెలయేళ్ళ ప్రవాహాలతో పూర్ణం అయిన వేంకటాచలమనే స్పృహణీయం అయిన పర్వతం, వైకుంఠమనే దేశం, శ్లాఘనీయం అయిన క్షీరాబ్ధి - ఇవి నీకు ఎంత ఆనందాన్ని ఇస్తాయో, అంత ఆనందాన్ని మీ దాసుడనైన నాకు మీ దివ్యపాదారవిందాలు కల్గిస్తాయి. వాటిని నాకు అనుగ్రహించండి స్వామీ.

**అవ :** శ్రీరామానుజులు అముదనారులకు తమ విషయంలోగల అతిమాత్ర ప్రావణ్యాన్ని గుర్తించి, "నాపై ఇంత భక్తిని కల వీరి మనస్సును ఒక క్షణంకూడా విడిచి ఉండలేను'' అని నిశ్చయించుకొని, వారి మనస్సులో నిత్యనివాసం చేశారు. దానినిచూచి అముదనార్లు సంతోషాతిశయంలో ఈ పాశురాన్ని పలుకుతున్నారు.

ఇరుప్పిడమ్ వైగున్దమ్ వేఙ్గడమ్, మాలిరుఞ్జోలై యెన్నుమ్
పొరుప్పిడమ్ మాయను క్కెన్బర్ నల్లోర్, - అవై తమ్మొడుమ్ వన్దు
ఇరుప్పిడమ్ మాయన్ ఇరామానుశన్ మనత్తు ఇన్రు అవన్ వన్దు
ఇరుప్పిడమ్, ఎన్దనిదయత్తుళ్ళే తనక్కిన్బుఱవే 106వ పా



సర్వేశ్వరుడు ఆదరంగా వేంచేసి ఉండే చోట్లు ఏవి? అని అంటే, పరమపదం, శ్రీవేంకటాచలం, తిరుమాలిరుమ్శోలై అనే దివ్యదేశాలు అని పెద్దలంటారు. ఈ దివ్యదేశాలతోపాటుగా భగవానుడు ప్రీతితో వేంచేసి ఉండే చోటు శ్రీరామానుజుల హృదయంలోనే. అటువంటి భగవద్రామానుజులు ఇపుడు ఎంతో కృపతో తనకు అత్యంతప్రీతిపాత్రమైనస్థానం అని వేంచేసి నిత్యవాసం చేసే చోటు నాహృదయంలోనే. ఆహా! ఏమి నా భాగ్యం!

మోహనరాగం - రూపకతాళంలో ఈ పాశురం ఉన్నది.

## శ్రీవేదాంత దేశికులు

కన్యాశ్రవణసంభూతం ఘంటాంశం వేంకటేశితుః ।
శ్రీమద్వేంకటనాథార్యం వందే వేదాంతదేశికమ్ ॥

అవ : శ్రీవేంకటేశ్వరుని ఘంటయొక్కఅంశతో క్రీ.శ.1268వ సం॥లో విభవనామ సంవత్సరం కన్యామాసం శ్రవణానక్షత్రంలో కాంచీపురంలో గల **"తూప్పుల్"** అగ్రహారంలో విశ్వామిత్రగోత్రీయులైన అనంతసూరి, తోతారాంబ దంపతుల పుత్రరత్నంగా అవతరించి, మేనమామ అయిన, అప్పుళ్ళార్ అనబడే ఆత్రేయ రామానుజులవారి పరిపూర్ణకటాక్షానికి పాత్రులై, సకలశాస్త్రపారంగతులై, శతాధిక గ్రంథకర్తలై, కవితార్కిక కేసరి- సర్వతంత్రస్వతంత్ర -వేదాంతాచార్యాది బిరుద భూషితులైన శ్రీమద్వేంకటనాథులు తాము అనుగ్రహించిన అధికార సంగ్రహమనే దివ్యప్రబంధంలో ఒక పాశురంలో శ్రీవేంకటాచలాన్ని కీర్తించారు. ఈ పాశురంలో శ్రీదేశికులు భగవానునకు గొప్ప వాసస్థానం- మహామహిమను గల శ్రీవేంకటమనే దివ్యపర్వతమే - అని అంటున్నారు.

### అధికారసంగ్రహం

కణ్ణవడియిణై యెమక్కు క్కాట్టుమ్ వెఱ్పు
క్కడునినైయ రిరువినైయుమ్ కడియుమ్ వెఱ్పు,
తిణ్ణ మిదు వీడెన్న త్తిగழுమ్ వెఱ్పు
తెళిన్ద పెరుమ్ తీర్త్తఙ్గళ్ శెఱిన్ద వెఱ్పు,
పుణ్ణియత్తిన్ పుగలిదెన పుగழுమ్ వెఱ్పు
పొన్నులగిల్ పోగ మెలామ్ పుణర్క్కుమ్ వెఱ్పు,

విణ్ణవరు మణ్ణవరుమ్ విరుమ్బుమ్ వెఱ్పు
వేఙ్గడ వెఱ్పెన విళఙ్గుమ్ వేదవెఱ్పే **43**వ పా

శ్రీకృష్ణుని శ్రీచరణాల జంటను మనకు దర్శింపజేసేది, క్రూరపాపాలను చేసినవారి ద్వివిధకర్మలను (పూర్వాఘ-ఉత్తరాఘాలను, లేక, పుణ్యపాపరూప కర్మలను) నశింప జేసేది, దృఢంగా ఈ దివ్యదేశమే పరమపదం అని చెప్పదగినట్లు విలసిల్లేది, స్వచ్ఛంగా ఉండే పలు పుణ్యతీర్థాలలో నిండి ఉండేది, "ఇది పుణ్యాలకు నెలవు" అని ప్రశంసింపబడేది, స్పృహణీయం అయిన పరమపదంలో అనుభవించే దివ్యాను భూతులన్నీ కరతలామలకం చేసేది, పరమపదవాసులైన నిత్యసూరులు, భూలోకంలోని మానవులు ఆశపడేది ఏది? అంటే, శ్రీవేంకటాచలమనే పేరుతో ప్రసిద్ధిచెంది, విరాజిల్లే వేదస్వరూపి అయిన (వేదప్రతిపాద్యమైన) దివ్యపర్వతమే.

